సంపుటము 1] ఆగస్టు 1914 [సంచిక 2

# బా ల మి త్ర

బాలికా బాలురకు దేవు – బాఁగొనర్చి
లలిని చేకూర్చునయు విద్య - లందలర్చి
మిథ్యఁ బోఁగార్చి ధీఁ గూర్చి – మిరఁ దనర్చి
త్రచ్చురహి “ బాలమిత్ర ” చి – త్రంబమర్చి ”



# ప్రకాశించుఁడి

ప్రకాశించుడీ, అను నాజ్ఞను
ప్రభువైన యేసు మనకిచ్చెను,
ప్రేమయను దివ్వె వెలిగింతుము,
నీవు నీ యింట్లోన—నే నాయింట్లో.

వంటయింటిలో సంతోషమ్మ అనే పిల్ల సహాయము చేయుచుండెను. ఒకనాడు ఆమె ఒక చెంబును తెచ్చి గట్టిగా రుద్ది తోముచుండెను. ఎవరో దానిని ఒక మూలను పారవేసినందున తుప్పుపట్టెను. దానిని యెట్లయినను బాగుచేతమని యావత్తు శక్తితో తోముచు,

"అజ్ఞానాంధకారం – వెలిగింతుము
నీవు నీయింట్లోన, నే నాయింట్లో, అని పాడుచుండెను.

"సంతీ! ఎందుకు ఆ చెంబును అంతగా తోమెదవు?" అని వంటకత్తె సుబ్బి యడిగెను.

"ఎందుకు అన్నావా! ఇది నేను చేయవలసిన నాపని గనుక – ఇదిగో విను.

'నీవు నీ యింట్లోన, నే నాయింట్లో'– తెలిసిందా! నేను చేయు గలిగిన నాపనిని నేను బాగుగా చేయవలెను. "నీవు చేయు గలిగిన పనిని నీవు బాగుగా చేయవలెను." అని సంతోషమ్మ మిక్కిలి సంతోషముతో చెప్పెను.

"నేనైతే అంతగా తోమనబ్బా! వృథాప్రయాస. ఎవరు చూస్తారు?" అని సుబ్బమ్మ అనెను.

సంతో:—"యేసు, యేసు! ఆయన చూచును. "నీ పనులన్నియుఁ—నా పనులుఁ"—అని తిరిగి పాడెను.

సుబ్బమ్మ:—(తనలో తాను) నిజమే. ఈ కూర బాగుగా వండుట నాపని. ఆ చిన్ని పిల్ల తన చేతనైనది బాగుగా చేయుగలిగితే, నాచేతనైనది నేను ఎందుకు చేయగూడదు. మూలనున్న చెంబులను ఆయన చూచినయెడల, కూరలను ఎందుకు చూడడు?" అని మనస్సులో తలంచుచు, ఆనాడు కూరను చక్కగా వండెను.

"సుబ్బమ్మా! ఎందుకబ్బా ఈ దినము కూర చాల రుచిగా ఉన్నద?"ని అనంతమ్మ అడిగెను.

సుబ్బమ్మ:—"అమ్మా! నిజము చెప్పెదను. చిన్ని సంతో మూలముననే" అని చెంబును గూర్చిన సంగతి అంతయు పూస గ్రుచ్చినట్లు చెప్పెను.

అనంతమ్మ ఆదినమున బట్టలను ఇస్త్రీ చేయుచుండెను. ఉదయమున పని చేయునప్పుడు, "ఇవి ఎట్లున్నను సరవాలేదులే. ఈ ఇంట్లోని పెద్దకుమార్తెయైన కమలమ్మ ఏమి అనుకొనదు." అని పని చేసి చేయనట్లుగా ఏదో ఒక విధముగా చేసెను. గాని ఈ మాటలు విన్నప్పటినుండి, తిరిగి మొదలుపెట్టి తన పనిని

నమ్మకముగా జేసెను. «ఆహా నాబట్టలు ఈ దినమున యెంత బాగున్నవి! వార వారము ఇట్లేందుకు జేయగూడదు?» అని కమలమ్మ యనెను. అనంతమ్మ నవ్వుచు, చెంబునుగూర్చిన సంగతి యంతయు ఆమెకు వినిపించెను.

కమలమ్మ ఆ దినమున ప్రార్థన కూటమునకు బోయి, పాటలలో సహాయము చేయవలసి యుండెనుగాని, తన స్నేహితురాలు ఒకతె వచ్చి, బజారుకు వెళ్లుదము రమ్మని యడిగినందున సరేనని జెప్పెను. ఆమె వచ్చి అడిగినప్పుడు, కమలమ్మ, «అయ్యో నన్ను క్షమించుము. నేను రాలేను, ప్రార్థన కూటమునకు వెళ్లవలెను. నాకు అక్కడ పని యున్నది» అనెను.

«నీకు పని ఉన్నదా! అక్కడ నీకేమి పని? బోధకురాలవేతివా?» అని స్నేహితురాలు అడిగెను. అంతట కమలమ్మ చెంబును గూర్చియు, చిన్ని సంటినిగూర్చియు చెప్పెను.

«సరే అట్లయితే నేనుగూడ నీవెంట కూటమునకు వత్తునని» యిద్దరును కలిసి అక్కడ జేరి తమ శక్తికొలది సహాయము జేసిరి.

సమాజము ముగిసిన తరువాత పాదిరిగారు వారియొద్దకు వచ్చి, వారి సహాయమునకు వందనములు చెప్పి, «మీరు ఈ సాయంకాలము [illegible]» అనెను.

“మా సంతోషమ్మ మూలమున వచ్చితినండి. చిన్ని చెంబు విషయములో కూడ తాను చేయగలిగినది చేయవలెనని దాని తలంపు.” అని పాదిరిగారికి ఆమె సంగతి యంతయు తెలిపెను.

పాదిరిగారు ఆ సాయంకాలమున మార్గమున వెళ్లుచు, దారి యందు ఎదురైన ఒక పూరియింటికడ ఆగి,” నిన్న ఈ యింటికి వెళ్లుటవలన లాభము లేదనుకొంటిని, కాని నేడు నేను చేయ గలిగినది ఏమైన ఉన్న యెడల చేసి చూచెద”నని లోపలికి వెళ్లెను. ఆ ఇంట్లో ఒక రోగి పండుకొనియుండెను. వానిని యెన్ని మారులు పాదిరిగారు దర్శించినను లాభము లేకపోయెను. ఆ రాత్రి వారు ఆయనను జూచి, “ఇదిగో నీకు ఒక చక్కని కథ చెప్పబోవుచున్నాను. వినుము”ని సంతోషమ్మనుగూర్చి చెప్పెను. అది అంతయు ఆ రోగి విని, తన కండ్లవెంట బొటబొటమని కారుచున్న కన్నీటిని తుడిచివేసి, “నేను చేయవలసిన పనియేదో కనుగొందును.—యేసుకొరకు ప్రకాశించుటకు ప్రయ త్నింతు”నని వాగ్దత్తము చేసెను. ఆ రోగి సంతోషమ్మ తండ్రియే. యేసుపై నుండి ఆమెను చూచి, “ఈమె తాను చేయగలిగిన దానిని చేసెనని” ఆమెను దీవించెను.

ఆ దినమున కమలమ్మ షికారు వెళ్లక, ఇంటియొద్దనే యుండి, తన తల్లి బట్టలను కుట్టి బాగుచేయుచుండెను. తల్లి వచ్చి ఆమెను చూచి “బిడ్డా! ఎందుకు షికారు వెళ్లలేదు?”

అని యడిగెను. ఆమె, "అమ్మా, ఇది నేను చేయగలిగినపని. ఇట్టి పనులను నేను తప్పక చేయవలసినది." అనెను. తల్లి, "ఇది నీ పనియా?" అని ఆశ్చర్యపడుచు అడిగెను. అప్పుడు కమలమ్మ చెంబునుగూర్చియు సంతోషమ్మనుగూర్చియు చెప్పెను. ఇంతలో ఎవరో తలుపుతట్టుగా, తల్లి వెళ్లి, పాదిరిగారిని తీసికొని వచ్చి కూర్చుండబెట్టెను. మిషన్ పనికొరకు తాను దాచి పెట్టిన 10 రూపాయలు బైటికి తీయుచు, "వంటగదిలో పని చేయు సంతోషము తాను చేయగలిగినది జేసినయెడల నేను ఎందుకు చేయగూడదు అనుచు, "అయ్యో పాదిరిగారూ! నేను చెప్పినదానికంటె కొంచెము ఎక్కువ ఇచ్చెదన"ని 25 రూపాయలు ఇచ్చెను.

ఆ దినమున ఆకాశమందు ఒక దూత, మరియొక దూతతో, "చూచితివా? మన సంతోషమ్మ మిషన్ పనికొరకు 25 రూ. ఇచ్చెను." అనెను.

"సంతోషమ్మ 25 రూపాయలు ఇచ్చినదా? ఆమె బీదది గదా. ఆమెకు అంత సొమ్మెక్కడిది?"

"ఆమె బీదదేగాని ఆమె పరలోకపు తండ్రి బీదవాడు కాడు. ఆమె తాను చేయగలిగినది చేసెను. మిగతది ఆయన పూర్తి జేసెను."

సంతోషమ్మకు ఈ సంగతి యేమియు తెలియదు. రెండవ నాడును ఆమె చెంబును తోముచు "అజ్ఞానాంధకారం - వెలిగింతుము

నీవు నీ యింట్లోన నేను నా యింట్లో!

---

# ప్రకృతి పాఠములు

## 1. అధ్యాయము.

### పువ్వులపై యాత్ర

పువ్వులు అనిన ప్రతివారికిని బహుప్రీతి, కంచెలలోగాని, పచ్చిక బయళ్లలోగాని, పొలముగట్లమీదగాని తోటలలోగాని, ఎక్కడ కనుపడినను అవి అందముగానుండి కన్నులకు ఆనందము కలిగించును. తోటలలో పాదులయందు బాగుగా వికసించిన పువ్వులనుజూచి సంతోషింపనివారు ఎవ్వరు? పువ్వుల యొక్క అనేక విధములగు రంగులు కన్నులకు పండుగగా నుండునుగదా! ఎఱ్ఱనివియు, తెల్లనివియు, నీలివర్ణపువియు, పసిమిరంగుగలవియు అగుపువ్వులు పచ్చని ఆకులతో గూడి చెట్లను అలంకరించుట చూచి దేవుని చేతిపనులను గూర్చి ఆశ్చర్యము పొందనివారుగలరా?



పుష్పాల అందమును జూచి మాత్రమే కాదుగాని, అవి ఏ లాగు చేయబడినవో కొంచెము జాగ్రతగా చూచినయెడల వింత కలుగకపోదు. మనకు కొన్ని పుష్పాలకంటె మఱి కొన్నిటి మీద ఎక్కువ ఆశ. మిగుల అందముగానుండి పెద్దదిగా నున్న పుష్పాకంటె చిన్నదైనను వాసనగలిగిన పుష్పాపై మిక్కిలి ప్రీతి. చేమంతిపుష్పాకంటె మల్లెపుష్ప ఎంత శ్రేష్ఠమైనది!

లోకములోని తోటలన్నిటిలో మొదటిది ఏదేను తోట. దీనిలోనే ఆదాము హవ్వాలు అను మన మొదటి తలిదండ్రులు

ఉంచబడిరి. ఇది బహు అందమైనది. వారు పాపము చేసిన పిమ్మట దేవుడు ఆ తోటలో వారిని ఉండనీయక తరిమివేసెను. అట్టి సుందరవనములో వారు ఉండుటకు తగియుండలేదు.

మన ప్రియస్నేహితులకు ఇచ్చే బహుమతులలో మిక్కిలి శ్రేష్ఠమైనది పుష్పగుత్తిగాక మరేమిటి? పిల్లలు తెచ్చిన పుష్పాలనుచూచి యే తల్లులు సంతోషింపకుందురు? ఎందువలన? పుష్పాలు బహు సాధారణమైనవిగదా. అయినను వాటిపై మనకు ఉండు ప్రేమయే వీటికి అంత గొప్పతనమును కల్గించుచున్నవి. పుష్పాలు వాడిపోయినను ప్రేమ వాడిపోదు.

రోగులు ఉండు గదులలో ఉంచబడు పుష్పాలు ఎంత ఉపయోగకారులైయుండునో అనుభవమువలననే తెలిసికొనవచ్చును. వారిని చూడజాలనివారు తాము వారికి పంపించు పుష్పాలద్వారా మంచి కబురులు పంపుదురు.

పుష్పాలను అలంకారములుగా ఉపయోగించుకొందురు. మనుష్యుల మాంసమును తినువారికిని వీటిపై గల ఆశను జూడగా ఆశ్చర్యముగలుగును. తలను పుష్పములతో అలంకరించుకొనుటకంటె మిగుల అందము కనబడదు. పుష్పాలు వాడిపోవును గనుక చేసిన పుష్పాలను సాధారణముగా తల మీద టోపీలపై ధరింతురు. వస్త్రములమీదను సామానుల మీదను పుష్పాలను వేతురు. బంగారు వెండి నగలపై పుష్ప

ములను చెక్కుదురు. లేసులు మొదలగువాటిని వేయునప్పుడును, బుటేదారు పనిలోను విశేషముగా పుష్పాలను వేతురు. సాధారణముగా దేనినైనను అందమైనదిగా కనుపర్చ గోరిన యెడల తప్పక దానియందు పుష్పాలరూపము కనుపడి తీరవలెను. చక్కని పుష్పాలు వేయుబడిన పనిముట్లనుగాని వస్త్రములనుగాని తప్పక కొని అలంకారముకొరకు ఉంచుకొందురు.

పుష్పాలంటే ప్రతివారికిని ప్రియమని పైన చెప్పబడెనుగాని అందరికిని అని చెప్పజాలను. పుష్పాలలోని అందమును చూడలేనంత గుడ్డివారు ఉండవచ్చును. డబ్బును పూర్తిగా కూడబెట్టుదలంచిన లోభికి పుష్పాలపై ఆశ యేముండును? పుష్పాలవలని లాభము ఏమాత్రమును లేదని తలంచువారును గలరు. తోటలలో పుష్పాల పాదులకుబదులు దుంపలను వేసిన యెడల బాగుండునని వారు అందురు. గాని వారు తమ కండ్లను విప్పి ఒకటి రెండు నిముషములవరకు ఎట్టి పుష్పానైనను నిదానించి చూచిన యెడల వాటిని తప్పక ప్రేమించుదురని నమ్ముచున్నాను.

ఆ॥ వె॥ దేవ నాదు బ్రదుకు - దివ్యమౌ కుసుమంబు।
భంగి సంతసంబొ - సంగఁజేసి।
బ్రోవు నన్నుఁ దృప్తిఁ - బొందినవానిఁగ।
నా గృహమునె నుంచి - నాదరింపు॥

# కుక్క, మత్తుమందు



మత్తుమందు, మత్తుమందు అని అనేక పర్యాయములు ఆసుపత్రికి పోయేవారు వినియుందురు. నీవు ఎప్పుడైనా

వినియున్నావా? ఈ మందు తినేది కాదు. గాని ముక్కుతో వాసన చూడవలసినది. వినుటకు భయము పుట్టునుగాని, దానిని ఒకమారు వాసన చూచిన యెడల భయము గియము ఎగిరిపోయి, చాల సంతోషముగా నుండును. కొన్ని మారులు జబ్బుపడిన వారిని కోస్తేనేగాని వారికి మందిచ్చి బాగుచేయుటకు వీలుకాదు. అట్టివారికి కలుగు బాధ ఎంత గొప్పదో చెప్ప వల్లకాదు. కాలికి ఒక చిన్న దెబ్బ తగిలి, వాచి, చీముపట్టిన యెడల యెంత బాధగా నుండునో చాలమందికి తెలిసిన సంగతే. చూస్తూ, చూస్తూ కత్తితో నీ చెయ్యి కోయించుకొనుటకు ఒప్పుకొందువా? బాధనుండియు నొప్పి నుండియు తప్పించుకొనుటకు ఒక తరహా మందును ఒక కుక్క ద్వారా దేవుడు కనుబరచి యున్నాడు. వినుట కిష్టమేనా?

షుమారు నూరేండ్ల క్రిందట స్కాట్లాండు దేశములో ఎడింబరో పట్టణమున వాల్డి అను ఒక గొప్ప వైద్యుడు ఉండెను. ఆయన మందుల గదిలో చాల ఎలుక లున్నందున వాటిని చంపుటకు ఆయన "క్లోరోఫామ్" అను మందును ఒక చిన్న పాత్రలో బోసి ఉంచి తన పనులను జేసికొనుచుండెను. ఇంతలో ఆయనను చూచుటకు ఒక స్నేహితుడు వచ్చి, ఆయనతో కూర్చుండి మాట్లాడుచుండెను. ఇతనివెంట ఒక పెంపుడు కుక్క కూడా ఆ గదిలోకి వచ్చెను. కుక్క ఒక

ఇంటిలో ప్రవేశించగానే చేసే మొదటి పని, అక్కడ ఉన్న వస్తువులను వాసనచూచుట గదా! ఈ కుక్క కూడ అది ఇది, అడ్డమువచ్చిన దాని దగ్గరకెల్ల మూతిపెట్టి, ఈ క్లోరోఫామ్ ఉన్న గిన్నెనుకూడ వాసన చూచి, తోకాడించి, ఇంకా కొంచెము సేపుండి, మెల్లగా నేలమీద ఒరిగెను.

ఆ స్నేహితులు ఇద్దరు తమ మాటల సందడిలోనే ఉండిరి గాని ఈ కుక్క పనులను గుర్తించలేదు. కొంచెము సేపటికి, ఆయన వెళ్ళుచు, "నాకుక్క నావెంట వచ్చినది కదా ఎక్కడున్నది" అని యడిగెను.

డాక్టరుగారు, "అదిగో అక్కడ పండుకొనియున్నది" అని చచ్చినట్లు పడియున్న కుక్క వంక చూపెను.

స్నేహి॥ "అయ్యో చనిపోయినట్లున్నదే" అని అంగలార్చెను.

డాక్టరు దానిని, పరికించి, "లేదు, లేదు. దాని గుండె బాగుగా కొట్టుకొనుచున్నది. ఇందాక అది ఆ పాత్రను వాసన చూచుచుండెను. ఎలుకలకొరకు, ఆ మందును అక్కడుంచితిని. దీని కిప్పుడేమియు తెలియదు. కోసినా కుంయ్ మనదు." ఒక గంటలోగా దీనికి బహుశా తెలివి రావచ్చును. దీనిగూర్చి నేను జాగ్రత్త పుచ్చుకొంటాను. మీరు వెళ్ళండి" అని ప్రత్యుత్తర మిచ్చెను.

తరువాత ఆ కుక్కకు తెలివివచ్చి యథాప్రకారము తిరిగెను. అప్పటినుండి డాక్టరు వాల్డెగారు శస్త్రము జేయవలసినప్పుడు దీనివలన యుపయోగమెట్టిదో కనిపెట్టెను.

---

## బాలమిత్ర టపా




ప్రియమైన బాలకులారా!

నేను ఇప్పుడు ఒకనూసను వయస్సుగలవాడను. పోయిన నెలలో నేను మీకు జెప్పిన కథలు మంచివిగావా? మీకు ఏమయినా చక్కని చిన్నికథలు వచ్చినయెడల నాకు జెప్పరా?

బాలమిత్రను చదువువారగు నా స్నేహితులైన మీరు వ్రాయు సంగతుల కొరకు ఎంతో యెదురుచూచుచున్నాను. మీ బడి, ఉపాధ్యాయులు, గృహమునుగూర్చియు, మీ సభలు, స్నేహితుల విషయమైకూడా నాకు వ్రాయుడి. వాటిని "బాలమిత్ర" యందు అచ్చువేయించుదును. నన్ను చదువని పిల్లలు ఎవరినైనను మీరు ఎరిగియున్న యెడల మీ నూతన స్నేహితునిగూర్చి వారికి తెలియచెప్పుడి. మీరు నాకే యుత్తరమైనను వ్రాయ కోరిన యెడల, మీ తల్లిగారిచేతగాని, మీ తండ్రిగారిచేతగాని, "ఈ. ఎస్. మెకాలి అమ్మగారు, గుంటూరు" అని పైవిలాసము వ్రాయించండి. మీరు వ్రాయునది అంతయు చదువుటకు నాకెంతో యిష్టము. బడియందు ఉత్తరములను వ్రాయుటకు నేర్చుకొనుచున్నారు గదా. మీరు నాకు వ్రాయుటద్వారా బాగుగా దానికి అలవాటు పడగలరు. సాధ్యమైనంతత్వరలో మీరు నాకు వ్రాతురని నమ్ముచున్నాను.

ఇట్లు మీ ప్రియ
"బాలమిత్ర"

---

# సన్యాసినిగూర్చిన కథ

పూర్వము ఒక క్రైస్తవ సన్యాసి ఉండేవారు. అతడు ఎప్పుడును సాయంకాలమున మిక్కిలి ఆయాసముతో

ఉన్నట్లు కనబడుచుండుట గురువు చూచి వానితో అయ్యా! నీవేల ఇంత ప్రయాసపడుచున్నావు? అని అడిగెను. అందుకతడు, అయ్యా? దేవుడు నాకు సహాయము చేస్తేనే గాని, నేను చేయవలసినపని చేయలేనుసుమండీ, అనెను. ఏమి చేయుచున్నావని ఆ గురువు అడుగగా, అయ్యా? వినుడు. నేను అనుదినము రెండు గ్రద్దలను మచ్చిక చేయవలయును. రెండు చెవులపిల్లులను, చేరిక చేయవలెను. రెండు డేగలను కాయవలెను. ఒక పెద్ద పామును జయింపవలయును. పెద్ద సింహమును లోపరచుకొనవలెను. ఒక రోగిని సంరక్షించవలెను, అని చెప్పెను. అందు కా గురువు ఆశ్చర్యపడి, ఏమి? ఇంతపని యొకడు ఒక దినమున చేయగలడా? అని యడిగెను. అప్పుడా సన్యాసి, అయ్యా! ఆశ్చర్యపడక వినుడు. రెండు గ్రద్దలనగా, నా రెండు కన్నులు. అవి తాము చూచిన వస్తువులందెల్ల నాకు ఆశ కలిగింపకుండ నాకు లోబడి యుండునట్లు చేసికొనవలెను. చెవులపిల్లులు నా కాళ్లు. అవి పాపమార్గము త్రొక్కకుండ నేను జాగ్రత్తపడవలెను. నా చేతులే, డేగలు. అవి పనిచేయుటకు వెనుకదీయక చెడుకార్యము చేయ ప్రయత్నించక యుండునట్లు వశము చేసికొనవలసి యున్నది. నానాలుకయే పెద్దపాము. నేను దానిని స్వేచ్ఛగా విడిచిపెట్టక వెనుకకు మట్టుపెట్టవలసియున్నది.

PRINTED AT THE C. L. S. PRESS, MADRAS—1914